# దేవుని లెక్కలతో - నీ లెక్క సరిపోయినదా ?

సకల శాస్త్రాలకు పుట్టినిల్లు ప్రకృతియైతే, ప్రకృతి జననానికి కారణం సర్వేశ్వరుడని మా పాఠకులకి తెలుసు.మనకున్న శాస్త్రాలలో గణిత శాస్త్ర మొకటి. దీని పుట్టుకకు కారణం, మనిషి ప్రకృతిని చూసి నేర్చుకున్నదే. అంకెలు ఆరంభానికి ప్రకృతిలోని గ్రహాల భ్రమణ, పరిభ్రమణాలే మూలం. ఏలయనగా ముందుగా మనమున్న భూమి తన చుట్టూ తిరుగు కాలాన్ని మనిషి లెక్కలు కట్టాడు. అదే భూమి సూర్యుని చుట్టూ తిరగటాన్ని, చంద్రుడు భూమి చుట్టూ తిరగటాన్ని చూసి దిన, నెల, సంవత్సరాలతో కాలమాన పట్టికను లెక్కలు కట్టి ఖచ్చితంగా తెలుసుకున్నాడు. ప్రపంచ ప్రారంభ గణిత శాస్త్ర పండితుడెవడైనా, వాడికి బాబు సృష్టికర్తేనని తెలుసుకొనవలెను. మనిషి లెక్కలలో పండితుడైనప్పుడు, వాని లెక్కలకు మూలమైన ప్రకృతిని, కలిగించిన కన్నతండ్రి లెక్కలలోనివాడు కాదుగానీ లెక్కించువాడేనని మొదట మీరు గ్రహించుకొనవలెను నీ కొరకు కలిగించిన ప్రకృతిని, అందలి వస్తువులనులెక్కించిన నీకే లెక్కల అవసరత వుంటే, నిన్నూ, ప్రకృతిని కల్గించిన వానికి లెక్కెంత అవసరమో చెప్పండి. దేవుడిచ్చిన ప్రకృతిని వాడుకునే మనిషి ప్రతీ చిన్నదానిని లెక్కించగా లేనిది, దానిని అనుభవించుటకు నీ కిచ్చిన తండ్రి నిన్ను లెక్కలలో వుంచటం ఆయన అనాది సంకల్పం. సృష్టి జనన రహస్యాన్ని ఆలోచిస్తే పరలోకపు తండ్రికి అవసరమైన లెక్క మన విషయమై వ్రాయించెను. ఆయన లెక్కలో **- ఎవరిని ముందుగా నిర్ణయించెనో వారిని పిలిచెను, ఎవరిని లెక్కగా పిలిచెనో వారినే నీతిమంతులుగా తీర్చెను. ఎవరు నీతిమంతుల లెక్కలోనికి వచ్చిరో వారినే మహిమపరచెను. రోమా 8 : 30.** భూకేంద్ర సిద్ధాంతం ప్రకారం భూమి మిగిలిన ప్రకృతి చక్రానికి కేంద్రం. ఆ భూమి దేవుని పిల్లల నివాసయోగ్యమై అందు దేవుని స్వరూపాలను కేంద్రముగా కలిగి యున్నది. ఇది విశ్వజన రహస్యమని మునుపటి పాఠాలలో వ్రాసితిని. దేవుని దృష్టిలో లెక్కలకుమూలకారణం దేవుని పిల్లలే అనుటకు సందేహం లేదు. ఏలయనగా **- మీ తల వెంట్రుకలన్నియు లెక్కింపబడియున్నవని, వాటిలో ఒకటైననూ నశింపదని దేవుడు వ్రాయించెను. మత్తయి 10 : 30.** తల దువ్వుకొనినప్పుడో లేదా స్నానం చేసినప్పుడో ఎన్ని వెంట్రుకలు నేల రాలుచున్నవో మనము లెక్కించనప్పుడు వాటిని కలిగించిన దేవునికి కష్టము తెలుసు గనుకనే విస్తారమైన నీ తల వెంట్రుకలను కూడా లెక్కించెనని వ్రాయబడినది. కష్టము సంపాదించిన యజమానికి తెలుస్తుందేమోగాని, ఏ కష్టమెరుగని సోమరికేమి తెలుస్తుంది దాని విలువ. వాటంతటవే మొలవగలవనుకున్న వెంట్రుకలపై నీకున్న జ్ఞానమంతే. అవగాహన లేని వానికి ఆలోచన వుండదు. కష్టపడి సాధించిన వానికే సంపాందించిన దాని విషయమై జ్ఞానముండును గాని తేరగా అనుభవించే మనిషికి మాత్రం దాని విలువ తెలియదు. ఏది ఏమైనా సృష్టి కర్తకు లెక్కల అవసరత మనపై అతిగా వున్నదను సరిక్రొత్త సందర్భాలను మీ కనవసరమైనది వ్రాయ పూనుకొంటిని. దేవున్ని లెక్కచేయని మనిషి ఒక దినాన్న లెక్క అప్పజెప్పవలసి వున్నాడన్నదే ఈ రచనలోని ప్రాముఖ్య సారాంశం.

**- దేవుని దృష్టికి కనబడని సృష్టము ఏదియు లేదు. మన మెవనికి లెక్క యొప్ప జెప్ప వలసి యున్నదో ఆ దేవుని కన్నులకు సమస్తమును మరుగులేక తేటగా యున్నది.** హెబ్రీ **4 : 13.** భూమి మీదకు వచ్చిన ప్రతి ఒక్కరూ ఏదో లెక్కదేవునికి అప్పగించవలసి యున్నదని తేట తెల్లమగుచున్నది. బ్రతుకే భారమైన మనిషికి దేవునికి లెక్క ఏ విషయంలో అప్పజెప్పవలసి యున్నదని ఆలోచిస్తున్నారా? పుట్టాను, చదివాను, ఉద్యోగినై వివాహమాడాను, సంపాదనతో కుటుంబముగా ఎదిగాను, కాలం చెల్లి అందరి కంటే ముందు చచ్చాను అని ఆలోచించక పరలోకపు తండ్రికై పుట్టానని, నిన్ను బ్రతికించుటకై ప్రకృతిని లెక్కల్లో నీ తండ్రి ఉంచాడని, నీకు అప్పగించిన పనిని లెక్కల ప్రకారము పూర్తి చేసి లెక్కించి ఇచ్చిన ఆయుష్షుని వాడుకొమ్మని దేవుడు నిన్ను నిర్ధేశించెను. **- మనిషి బ్రతుకు దినములన్నియూ దేవుని గ్రంథములో లెక్కింపబడి వ్రాయబడెను. కీర్తన 139 : 16.** అందును బట్టి **- నీవు కూర్చుండుట, నీవు లేచుట, నీ నడక, నీ పడక, పిమ్మట నీ చర్యలన్నింటినీ నీ దేవుడు పరిశీలించి పరిశోధించి బాగుగా తెలుసుకొనుచున్నాడు. నీ మాట, నీ ముందు, నీ వెనక ఎరిగి అటు అంతరిక్షము, ఇటు పాతాళములలో నీ**

**వెక్కడున్ననూ నీపై నిఘా వుంచి నీ దేవుడు తెలుసుకొనుచున్నాడు. కీర్తన 139 : 1- 10.** ప్రపంచంలో ఒక అగ్రరాజ్యాధినేతకుఎంతటి విస్తృతమైన భద్రత వుంటుందో భూమి మీద నీపై అంతకంటే అతిపెద్ద నిఘా విభాగాన్ని దేవుడు నీకు కల్పించుటలో ఒక లెక్కవున్నదన్న సంగతి నీవు మరచి పోకూడదు. ఒకనాడు యోనా తనకున్న నిఘా విభాగాన్ని మరచి దేవుడు వెళ్ళమన్న చోటుకి పోకుండా దారి మళ్ళిన సంగతి మీకెరుకే, నీనెవే పట్టణానికి పోకుండా తర్షీషుకు పోయే ఓడ నెక్కి బాధ్యత మరచి ఓడ అడుగు భాగమున నిద్రించెను. అందుకు ఫలితం సముద్రంలో తుఫాను ఆరంభమై ఓడ మునిగే సమయానికి యోనాను పట్టి ఓడలోని వారు సముద్రంలోనికి విసురుట, పిమ్మట తిమింగలం అతన్ని మింగివేయుట, యోనా మారుమనస్సు పొంది బ్రతుకు జీవుడా అనిదేవుని ఇష్టాన్నినెరవేర్చుటకై నీనెవె పట్టణానికి పోవుట. ఒక మనుష్యునిపైసృష్టికర్త వుంచిన నిఘా మీరు ఆలోచించగలిగితే మీ కొరకూ కూడా ఏర్పాటు చేయబడిన శక్తివంతమైన పరలోకపు నిఘా విభాగాన్ని వెలిగింపబడిన మీ మనోనేత్రాలతో చూడగలరు. పరలోకమందున్న కోటానుకోట్ల దేవ దూతలు రక్షణయను స్వాస్థ్యము పొందబోయే దేవుని కుమారుల కాపుదలకే వున్నారను సంగతి ఈ సందర్భముగా మీరు గుర్తు చేసుకొనవలెను. కోట్ల కొలదిగా మహాశక్తి వంతులైన దేవదూతలు కేవలం దేవుని పిల్లల పరిరక్షణకై, బాధ్యతలు కలిగివున్నారు. భూమి మీదికి వచ్చి పెద్దవాడై, ఇశ్రాయేలీయులకు నాయకత్వం వహించి దేవుని వాగ్దానం ప్రకారం వారిని పాలస్తీనాకు నడిపించుటకు సీనాయి కొండపై నుండి ధర్మశాస్త్రాన్ని తెచ్చుటకు దేవుని లెక్కలలోని మోషేను ఆరంభమునుండే అందమొందించాలన్న దుష్టుని చేతి నుండి కాపాడుటకు దేవుడు కల్పించిన మహాశక్తి వంతమైన నిఘా విభాగాన్ని చూచి ఆశ్చర్యపడక తప్పదు. **ప్రధాన దూతయైన మిఖాయేలు అపవాదితో వాదించుచూ మోషే యొక్క శరీరమును గూర్చి తర్కించినప్పుడు, అపవాదిని దూషించి, తీర్పు తీర్చ తెగింపక - ప్రభువు నిన్ను గద్దించును గాక అని. యూదా 9వ.** ఇది మరణించిన మోషే శవం గూర్చి కాదు గాని దేవుని లెక్కలలో బాధ్యత కలిగి భూమి మీద బ్రతికున్నప్పుడే అపవాది కబళించాలనుకున్న తరుణంలో మోషే కొరకు నియమింపబడిన నిఘా విభాగపు నేత, ప్రధాన దూతయైన మిఖాయేలు కాపాడిన వైనం. ఈ రక్షక వలయం కేవలం మోషేకు మాత్రమేనని మీరనుకుంటే పొరపాటే. దేవుని లెక్కలలో భూమి మీదికి పుట్టుకు వస్తున్న దేవుని పిల్లలందరిపై పటిష్టమైన బలమైన కోట్లాది మంది దేవదూతల దుర్భేద్యపు నిఘా విభాగపు వ్యవస్థ ఏర్పరచబడినదని మీరు తెలుసుకొనవలెను. - **మీ దూతలు, పరలోకమందున్న నా తండ్రి ముఖమును ఎల్లప్పుడూ పరలోకమందు చూచుచుందురు. మత్తయి 18 : 10.** ఇప్పుడు చెప్పండి. మీకూ ఒక లెక్కుందని, ఆ లెక్కలో మిమ్మును కాపాడుటకు లెక్కలేనన్ని బలాఢ్యమైన దేవదూతలు కాపలా కలదని నమ్మగలరా? **యెహోవా యందు భయభక్తులు గలవారి చుట్టూ ఆయన దూత కావలి యుండి వారిని రక్షించును - కీర్తన 34 : 7. నీ మార్గములన్నింటిలో నిన్ను కాపాడుటకు ఆయన నిన్ను గూర్చి తన దూతలకు ఆజ్ఞాపించును - కీర్తన 91 : 11.**

యాకోబును ఖడ్గముతో చంపించిన తరువాత రాజైన హేరోదు యూదులను సంతోష పెట్టుటకై పేతురును నాలుగు చతుష్టయముల సైనికుల మధ్య బంధించెను. మరుసటి ఉదయానికే చంపబడవలసిన పేతురును దేవదూతల నిఘా విభాగపు భద్రత అధికారియైన ప్రభువు దూత అతనిని చెరసాల నుండి విడిపించిన విధానాన్ని అపో ॥కా॥ 12వ అధ్యాయంలో ప్రారంభ వచనం నుండి చదవండి. అందుకే మహాబలిమి కలిగిన దేవదూత గణం - **రక్షణయను స్వాస్థ్యం పొందబోవు వారికి పరిచారము చేయుటకై పంపబడిన సేవకులైన ఆత్మలు. హెబ్రీ 1 : 14.**

ప్రపంచంలో మానవ రాజ్యాలలోని గొప్పవారు అనుకున్న వారికే లేని బలోపేతమైన పరలోకపు నిఘా విభాగంలో కోట్లాది మంది దూతలు మీ కొరకూ పనిచేయ గలుగుతున్నారంటే, నీవు దేవుని లెక్కల్లో వున్నావన్న సంగతి తెలుసుకొనవలెను. ఇంతటి భారీ భద్రతా ఏర్పాట్ల మధ్య నీపుట్టుక, నీ జీవితం ఆరంభమైతే నీకుమాత్రం దేవుడు లెక్క లేకుండా పోయాడు. భూమి మీద ఇసుక రేణువులు సంఖ్య, అంతరిక్షంలోని నక్షత్రాల సంఖ్య దేవునికి తెలిసినప్పుడు నీ గూర్చి ఆయనకు తెలీదనుకోవటం నీ వెఱ్ఱితనమౌతుంది. భూమి మీద ప్రతి మనిషి దేవుని లెక్కల్లో వున్నాడు గనుకనే - **మనలో**

ప్రతివాడునూ తన్నుగురించి దేవునికి లెక్క అప్పగింపవలెను. రోమా 14 : 12. ఒక వేళ యేసు రాక ఆలస్యమైతే మీ బ్రతుకు దినాలలో ఇవ్వబడిన చివరి దినమే నీకు అంత్యదినమై వుండును గనుక అప్పటికే నీ బ్రతుకు దినములన్నింటిని గూర్చి ఆ దినమున లెక్క అప్పగించవలసియుండును.

**- ఇప్పుడు ఈ లోకమునకు తీర్పు జరుగుచున్నది. యోహాను 12 : 31, నా మాట విని నన్ను పంపిన నా తండ్రి యందు విశ్వాసముంచువాడు నిత్య జీవం గలవాడు గనుక వాడు తీర్పులోనికి రాక మరణములో నుండి జీవములోనికి దాటియున్నాడు. యోహాను 5 : 24. - ఆయనయందు విశ్వాసముంచువానికి తీర్పుతీర్చబడదు. విశ్వసింపని వానికి ఇంతకు మునుపే తీర్పు తీర్చ బడెను. యోహాను 3 : 16 -18. ఈ పత్రిక చదువుతున్నప్పటికీ నీవు దేవుని ఇష్టాన్ని నీ జీవితంలో కొనసాగించగలిగితే విశ్వాసిగా మరణించిన మరుక్షణమే పరదైసుకు పోగలవు లేనియెడల పాతాళం తప్పదు. ఆ తీర్పు ఇదే. వెలుగు (వాక్యం) లోకములోనికి వచ్చెను గాని తమ క్రియలు చెడ్డవైనందున మనుష్యులు వెలుగును ప్రేమించక చీకటినే ప్రేమించిరి. యోహాను 3 : 19 ; నన్ను నిరాకరించి నా మాటలను అంగీకరింపని వానికి తీర్పు తీర్చువాడొకడు కలడు. నేను చెప్పిన మాట (బైబిల్) యే అంత్య దినము (మరణ దినము ) నందు వానికి తీర్పు తీర్చును. యోహాను 12 : 48. ప్రతి మనిషి మరణానికి ముందు బైబిలు ప్రకారంగా బ్రతుకుచున్నాడో లేడో అన్నది నిర్ధారించి అటు పాతాళంకు గాని ఇటు పరదైసుకు గాని వెళ్ళిపోవలసినదే. మరణించిన మరుక్షణమే ఏ ప్రక్కకు వెళ్ళవలయునన్నది నీ చేతలే నిర్ణయించగలవు. - వారు శ్రేయస్సు కలిగి తమ దినములు గడుపుదురు. అయిననూ ఒక్క క్షణములోనే పాతాళమునకు దిగుదురు. యోబు 21 : 13, మేఘము విడిపోయి అదృశ్యమగునట్లు పాతాళమునకు దిగిపోయినవాడు మరి ఎప్పుడును రాడు. అతడు ఇక ఎన్నడునూ తన ఇంటికి రాడు. అతని స్థలము అతనిని మరలా నెరుగదు. యోబు 7 :9,10, మరణించిన తరువాత ఆశ ఏదైనా నాకుండిన యెడల పాతాళము నాకు ఇల్లు అని ఆశయే. యోబు 17 : 13. - యాకోబు ఓదార్పు పొందనొల్లక - నేను అంగలార్చుచూ మృతుల లోకమునకు వెళ్ళెదనని చెప్పెను. ఆది కా॥ 37 : 35; పాతాళమునకు నీవు నన్ను అప్పగింపవు. కీర్తన 16 : 10, యేసు సిలువలో దొంగ వానితో - నేడు నీవు నాతో కూడా పరదైసులో వుందువు. లూకా 23 : 43; దరిద్రుడు చనిపోయి దేవదూతల చేత అబ్రహాము రొమ్మున (పరదైసులో ) ఆనుకొనుటకు కొనిపోబడెను. ధనవంతుడైతే చనిపోయి పాతాళములో బాధ పడుచుండెను. లూకా 16 : 22, 23.**

జీవ వాక్యంలో వ్రాయబడిన పై వాస్తవాలను నీ బ్రతుకులో ఎప్పటికినీ మర్చిపోకూడదు. మరణించిన తరువాత కూడా ఏడేండ్లు పెండ్లి విందు, శ్రమల కాలములలో ప్రత్యేక తరగతులు తీసుకొనబడునని తప్పుడు బోధకుల, తప్పుడు సంగతులలో మీరు ఉండకుండా, మృత్యువువచ్చిన క్షణంలోనే ఏదో దిశకు పోవలసియున్నది. నీకు మరో అవకాశం లేదు. అంత్య తీర్పు అనగా సింహాసనము, ఆసీనుడైన దేవుడు ఆయన ముందు కోట్లాది మంది మనుష్యులు అన్నవి రూపకాలంకారముగా బైబిలులో ప్రస్తావించబడినవి. ఒకవేళ అది రూపకాలంకారము కాదనుకుంటే మరణించిన వెంటనే ధనవంతుడు శిక్షననుభవించుటకు పాతాళానికి, లాజరు నెమ్మది అనుభవించటానికి పరదైసుకు వెళ్ళారు. చనిపోయిన వెంటనే వారుచేయు క్రియలను బట్టి శిక్ష అమలు జరుగుతుందని ఇక్కడ గమనార్హం. ఒక్కసారి శిక్షలోకి గానీ, నెమ్మది లోకి గానీ వెళ్ళిన వారికితిరిగి తీర్పు జరగటం హాస్యాస్పదం. బైబిల్ఎప్పుడూ ఒకే కోణం నుంచి గానీ ఒకే వాక్యంతో గానీ నీ బ్రతుకును నిర్దేశించదు. అన్ని కోణాల నుండి 66 పుస్తకాల నుండి విషయాన్ని కూలంకషంగా పరిశోధించాలి. మనమింకా పరలోకానికి వెళ్ళం, ఆదాము మొదలుకొనిమరణించిన వారంతా పరదైసను నీతిమంతులు వుండే నెమ్మది పొందు చోటికి పోగలరు. యేసు రెండవ రాకతో - తండ్రి ఇష్టాన్ని నెరవేర్చిన వారు యేసుతో కూడా పరలోకానికి వెళ్ళగలరు. అంతవరకూ నీతిమంతులు పరదైసుకు, అనీతిమంతులు పాతాళంలోని వేదనకర స్థలమునకు పోవలెను.

**- వీరందరూ తమ విశ్వాసం ద్వారా సాక్ష్యం పొందిన వారైననూ మనము లేకుండా (మొత్తం లెక్క పూర్తి కాకుండా) సంపూర్ణులు కాకుండు నిమిత్తం, దేవుడు మన కొరకు మరి శ్రేష్ఠమైన దానిని ముందుగా సిద్ధపరచెను గనుక (మనకంటే ముందు మరణించినవారు) వీరు వాగ్దాన ఫలము అనుభవింపలేదు. హెబ్రీ 11 : 39, 40.** ఆదాము మొదలుకొని నేటివరకూ మనకంటే ముందు మరణించిన వారుపరలోకానికి పోలేదు. ఎందుకనగా దేవుని సంకల్పంలో ఆయన పిల్లలుగా పరలోకానికి రావలసిన వారి లెక్క పూర్తి కావలసివున్నది. ఎవరు బడితే వారు పరలోక ప్రవేశం చేయకుండా భూమి మీద దేవుని లెక్క ప్రకారం తమ జీవితాలను కొనసాగించ గలిగిన వారే మరణం తరువాత పరదైసుకును అటు పిమ్మట యేసు రెండవ రాకడలో ఆయన ద్వారా దేవుని లెక్కలో వున్నవారుపరలోకానికి వెళ్ళెదరు. ఇట్టి దేవుని లెక్క ఈనాటిది కాదని కోటానుకోట్ల సంవత్సరాలకు పూర్వం సృష్టి పుట్టకముందటి నాటిదని వాక్యం చెప్పుచున్నది. **యేసు క్రీస్తు ద్వారా తనకు కుమారులనుగా స్వీకరించుటకై మనలను ముందుగా తన కోసం నిర్ణయించుకొని, మనం తన యెదుట పరిశుద్ధులమును, నిర్దోషులమై వుండవలెనని జగత్తు పునాది వేయబడక మునుపే మనలను ఏర్పరచుకొనెను. ఎఫెసీ 1 : 6.** దేవుని లెక్కల ప్రకారం సృష్టి ఆవిర్భావం తరువాత తల్లి గర్భముల ద్వారా నిర్ణయించబడిన వారు మాత్రమే మానవ ఆకారాలను ధరించుకొని భూమి మీదకు రాగలుగుచున్నారు. తల్లిదండ్రుల గర్భమునుండి మానవ ఆకారములను తెచ్చుకోలేని ఎందరో నేల రాలిపోతుండగా భూమి మీదికి నీవు మాత్రమే శరీరముతో రాగలుగచున్నావంటే దానికున్న కారణం నీవు ఆయన లెక్కల్లో వున్నావని తెలుసుకొనలెను. **ఈ లోకమందు ప్రవేశించునపుడు నీకొక శరీరం యేసువలె అమర్చబడినదని గ్రంథపు చుట్టలో నిన్ను గూర్చి కూడా వ్రాయబడిన ప్రకారము పరలోకపు తండ్రి ఇష్టాన్ని నెరవేర్చుటకై వచ్చితివి. హెబ్రీ 10 : 5 - 7 ; నా తల్లి గర్భమందు నన్ను నిర్మించిన వాడవు నీవే, నా దినములన్నియూ నీ గ్రంథములో లిఖితములాయెను. కీర్తన 139 : 13, 16.** పై మాటలనుబట్టి లెక్కల్లో వున్నావు గనుకనే శరీరంతో భూమి మీద బ్రతికి, బట్ట కట్టగలిగావు. నీవు ఆయన ఆలోచనలలో లేకపోతే భూమి మీద నీకు గుర్తింపు కానీ, అడ్రస్ కానీ వుండదు. కూడు గలిగితే కులం మర్చిపోతారని పెద్దలంటారు. అలాగే పుట్టగానే నీ అంతటి వారు లేరనుకుంటున్నావు. ఇది నీకర్థం కాకపోతే నీకు, పిచ్చి పట్టిన వానికి తేడా లేదు. మీ మట్టి మెదడుకు అంతుపట్టని మరో విషయాన్ని మికిక్కడ గుర్తు చేస్తున్నాను. పుట్టుకతో వున్నవాడిననో, నడమంత్రపు సిరితో వెలిగిపోతున్నాననో ఇక ముందు నీవనుకొనకూడదు. ఒక పిచ్చివాడు భూమి మీద పుట్టిన తరువాత ఈలాగే అనుకున్నప్పుడు, దేవుడు **- వెఱ్ఱివాడా, ఈ రాత్రి నీ ప్రాణము నడుగుచున్నారు. ఇంతరకూ నీవు కూడగట్టినది ఎవరివగును ? లూకా 12 : 20.** ఇక్కడ దేవుడు ఈ పిచ్చివాని ప్రాణాన్ని అడుగుటలేదు. ఎవరో అడుగచున్నట్టు దేవుడుచెప్పుచున్నాడు. ఎందుకనగా ఇలాంటిపిచ్చివాళ్ళ లెక్క పాతాళానికి అవసరం. అన్నీ లెక్కల మయమే. పిచ్చివాడి పుట్టుక ఒక లెక్కే. వాడు చచ్చాక, పాతాళంలోవాని లెక్క ఒక లెక్కే, ఖైదీలు జైల్లో వుండుట ఒక లెక్కే, లెక్కల్లో ఏ ఒక్క ఖైదీ వుండకపోయినా జైలు అధికారులు ఊరుకోనగలరా ? చట్టం వారిని విడిచి పెడుతుందా ? భూమి మీద నేరస్తునికే ఇంత పటిష్టమైన లెక్క అమలు జరిపితే పాతాళానికి నేరస్తుల లెక్క అంతకంటేఎక్కువ. **- నీవు ప్రవేశించుచుండగానే నిన్ను ఎదుర్కొనుటకై క్రింద పాతాళం నీ విషయమై కలవరపడుచున్నది. అది నిన్ను చూచి ప్రేతలను రేపు చున్నది. యెషయా 14 : 9.** కరుడుగట్టిన భయంకరమైన నేరస్తుడు ఏ జైలుకైతే పంపబడునో ఆ జైలు అధికారులు అట్టివాని కొరకు భద్రత, మున్నగు వాని విషయమై కలవరపడుట ఎంత సహజమో దేవుని లెక్కల్లో పుట్టి, దేవుని కొరకుబ్రతుకక దేవునికి భిన్నంగా బ్రతికే నీవు అతిభయంకరమైన నేరస్తుడవు. ఎందుకనగా నీవు అనుభవించుచున్న సృష్టిని నీకంటే ముందు కలిగించి, నీవు పుట్టకముందే నీ మానవ ఆకారంలో ప్రకృతిలోని రంగుల సౌందర్యాలను చూచుటకు కళ్ళు, సువాసనలను ఆఘ్రాణించే ఒక ముక్కును, రుచులను అనుభవించే నాలుకను ఇలా శరీరంలో ప్రతి అవయవాన్ని సంతృప్తిపరచే ఎన్నో వసతులను ప్రకృతిలో నీ కొరకు భద్రపరచి, తండ్రి ఇష్టాన్ని నెరవేర్చుటలో నిమగ్నమైన నీకు అనుభవించుటకు సృష్టిలో వీటన్నిటినీ నీ కొరకే కల్గించెను. లెక్కల

ప్రకారంగా నీ పుట్టుక జరిగి ఆయనను లక్ష్యపెట్టక నీ లెక్కల్లో నీవుంటే, నీలాంటి వెఱ్ఱివారిని త్వరగా తీసుకురమ్మని నీకంటే ముందుగా చేరిన పాతాళంలోని ప్రేతలు నిన్ను కోరుకోవటంలో తప్పేముంది. పాతాళం కూడా నీ ప్రాణం తియ్యమని దానిలోని ప్రేతలను రేపుచున్నది గనుకనే **ఈ రాత్రి వారునీ ప్రాణమును అడుగుచున్నారు ?** అని ఆ వెఱ్ఱివానితో దేవుడు చెప్పెను. ఇది పాతాళపు లెక్కల విభాగం.

ఇదిలా వుండగా పరదైసు లెక్కల విభాగం సంగతులను పరిశోధించుటకు బైబిలులోనికి వెళదాం. **ఆయన ఐదవ ముద్రను విప్పినప్పుడు దేవుని వాక్యం నిమిత్తమును తాము ఇచ్చిన సాక్ష్యం నిమిత్తమునూ వధింపబడిన వారి ఆత్మలను బలిపీఠము క్రింద చూచితిని. వారు - నాథా, సత్యస్వరూపీ, పరిశుద్ధుడా, ఎందాక తీర్పు తీర్చకయు, మా రక్తము నిమిత్తము భూ నివాసులకు ప్రతి దండన చేయకయు వుందువని బిగ్గరగా కేకలు వేసిరి. తెల్లని వస్త్రము వారిలో ప్రతి వానికియ్యబడెను. మరియు - వారి వలెనే చంపబడబోవు వారి సహదాసుల యొక్కయు, సహోదరుల యొక్కయు లెక్క పూర్తియగు వరకూ ఇంక కొంచెము కాలము విశ్రమింపవలెనని వారితో చెప్పెను. ప్రకటన 6 : 9 - 11.** దేవుని ఇష్టాన్ని నెరవేర్చుటకై తాము భూమి మీదకు శరీరాలతో వచ్చితిమని ఆత్మ జ్ఞానాన్నికలిగిన ఎందరో సమయమనక, అసమయమనక, కుటుంబమనక, ఉద్యోగమనక, లేనిదనక, ఉన్నదనక తన శరీరములో రక్త మంతటినీ చెమట బిందువులుగా మార్చి వారి కష్టాన్ని వారి ఆరోగ్యాన్ని, వారి సమయాన్ని పరలోకపు తండ్రి కొరకూ పానార్పణముగా పోయుచున్నారు. వీరు పరలోకపు లెక్కల్లో వుండాలనుకున్నారు గనుక లోకము ఏవిధంగా అడ్డు తగిలినా భూమి మీద దేవుని ఇష్టాన్ని జరిగిస్తూనే వున్నారు. ఇట్టి వారిలో భూమి మీద మరణించిన వారు మీ కంటే ముందుగా పరదైసుకు వెళ్లి, యేసు వస్తేనే గాని పరలోకానికి వెళ్ళలేమన్న నిజాన్ని తెలిసికొన్న వారై పరదైసులో నెమ్మది పొందుచున్ననూ యేసుతో పరలోకానికి వెళ్ళి తండ్రిని చూడాలని ఆశపడుచున్నారు గనుకనే ఎంతకాలం ఇక్కడ విశ్రమించాలి అని అడుగుచున్నారు. వారి వలే భూమి మీద త్యాగధనులైన దేవుని లెక్కల్లో గల సహదాసుల, సహోదరుల లెక్క పూర్తగుటకు కొంచెము కాలము విశ్రమింపవలెనని వారికి తెలియజేయబడినది. ఎటు చూచినా లెక్కల మయం జరుగవలసిన వన్నియూ లెక్కల ప్రకారమే జరగాలి అటు పరలోకపు లెక్క పూర్తి కాగానే మిగిలిన వారితో పాతాళపు లెక్క పూర్తగునని అర్థమగుచున్నది. ఒక్క మాట మాత్రం నిజం - **రక్షణ పొందు వారు కొద్ది మందే. లూకా 13 : 23, 24; యేసు రెండవ రాకడలో భూమి మీద విశ్వాసులుండరు. లూకా 18 : 8;** పై మాటల్లో అతికొద్దిమంది మాత్రమే భూమి మీద శరీరాలతో వచ్చినవారు మరణం తరువాత పరలోకానికి వెళ్ళుదురన్న నగ్నసత్యం బైబిలు తేటగా చెప్పుచున్నది. ఈ మాట మనకెంతో భయం కల్గిస్తున్నది. ఎందుకనగా వారంలో నీకిష్టమైతే ఒక గంట గుడికి పోవాలన్న ఆచారం ప్రకారం పోతున్నావే తప్ప అసలు నీ పుట్టుక పరమార్థాన్నే ఎరుగకున్నావు. క్రైస్తవ కుటుంబంములో పుట్టో, జీవితంలో యేసును రక్షకునిగా అంగీకరించో దేవుని కుమారుడనని చెప్పుకునే నీవు బైబిలులోని 66 పుస్తకాలలో నీ కొరకు వ్రాయబడిన మహాజ్ఞానాన్ని, ఎన్నడైనా చదవగలిగావా ? ఆలోచించగలిగావా ? చేయగలిగావా? పనిచేయని ఏ ఒక్కడూ విశ్రాంతి ఏవిధంగా నోచుకోడో, దేవునికై ఏ పనీ చేయని నీకు పరలోకపు విశ్రాంతి అవసరమంటావా ? పుట్టుక, బ్రతుకు, చదువు, వివాహం, కుటుంబం దానిని నడపటం మున్నగు వాటితో దేవుడు లెక్కగా నీకివ్వబడిన కాలాన్ని కేవలం నీ ఇష్ట ప్రకారం వాడుకుంటే అగ్ని జ్వాలలోనికి పోక నెమ్మది స్థలములోనికి ఎట్లు పోగలవు ?

**- అగ్ని జ్వాలల్లో యాతన పడుచున్న ధనవంతుని చూచి అబ్రహాము - కుమారుడా, నీవు నీ జీవిత కాలమందు నీకిష్టమైనట్టు సుఖము అనుభవించితివి గనుకనే ఇక్కడ యాతన పడుచున్నావు. లూకా 16 : 24, 25.** ఎవరు చేసిన దానికి వారు అనుభవించక తప్పదు. తండ్రియైన దేవుడంతటి వాడు తన పిల్లల కొరకు కష్టపడి పనిచేయగా లేనిది, ఆయన కుమారుడనని చెప్పుకునే నీవు ఆయన కొరకు కష్టపడవా? **దేవుడు మన కొరకు తన కార్యములన్నిటినీ చేసి ముగించిన తరువాత విశ్రమించెను గనుక తండ్రున్న ఆ విశ్రాంతిలో ప్రవేశించుటకు ఇష్టపడువారు కూడా తండ్రి కొరకు తన కార్యములను ముగించి విశ్రమించుట న్యాయం. హెబ్రీ 4 : 4-10.** ఇప్పుడు చెప్పండి.

మీరు పని చేస్తారా ? చేయరా ? విశ్రాంతి అవసరం అనుకుంటే ఇప్పటికైనా పనిలో దిగండి. మీకు విశ్రాంతి అవసరం లేకపోతే పాతాళపు లెక్కపూర్తి చేయుటకై భూమిమీద సుఖపడండి. శాశ్వత సుఖం కావాలి అనుకుంటే భూమిపై గల ఈ చిన్న మానవ జీవితంలో అనేక త్యాగాలను చేయండి. లేదా ఇక ముందుకు చదవండి.

## పరలోకపు తండ్రి పనిని పూర్తి చేయుట :

దేవుని అనాది సంకల్పపు లెక్కల ప్రకారం భూమి మీద పుట్టిన ప్రతి మనిషి- దేవుడు తనకివ్వబడిన శరీరంలో అప్పగించిన ప్రతీపని పూర్తి చేయవలెను. తిని, త్రాగి, తిరిగి భూమి మీద సుఖించుటకు దేవుడు మానవ ఆకారాన్ని మనిషికివ్వలేదు గానీ ఇవ్వబడిన మానవ ఆకారంతో కనీస అవసరతలను తీర్చుకుని మిగిలిన కాలమంతయూ జగత్తు పునాది వేయబడక ముందే భూమి మీద మానవ ఆకారంతో ప్రతి మనిషి చేయవలసిన పనులను తన గ్రంథంలో వ్రాయించి, వాటిని చేయుటకు తగినంత కాలాన్ని "ఆయుష్కాలం" గా నిర్ణయించి భూమి మీదికి పంపెను. - **వాటియందు మనము నడుచుకొనవలెనని దేవుడు ముందుగా సిద్ధపరచిన సత్క్రియలు చేయుటకై, మనము క్రీస్తు యేసు నందు సృష్టింపబడినవారమై ఆయన చేసిన పనియై యున్నాము. ఎఫెసీ 2 : 10 ; - క్రీస్తు నందు ముందుగా నిరీక్షించిన మనము తన మహిమకు కీర్తి కలుగ జేయవలెనని, దేవుడు తన చిత్త ప్రకారమైన దయా సంకల్పమును బట్టి మనలను ముందుగా నిర్ణయించి ఆయన యందు స్వాస్థ్యముగా నేర్పరచెను. ఈలాగున తండ్రియైన దేవుడు జగత్తు పునాది వేయబడక మునుపే వ్రాయించిన తన చిత్తానుసారముగా చేసిన నిర్ణయం చొప్పున సమస్త కార్యములను జరిగించుచున్నాడు. ఎఫెసీ 1 : 11, 12.**; కడకు తన కుమారుడైన యేసు క్రీస్తుకు కూడా అతి తక్కువ ఆయుష్కాలాన్ని నిర్ణయించి ఆయనకప్పగించిన ప్రతీ పనినీ భూమి మీద పూర్తి చేసుకుని తిరిగి తన యొద్దకు రావలెనని ఆజ్ఞాపించెను గనుకనే - **నేను నెరవేర్చుటకై తండ్రి యే క్రియలను నాకిచ్చియున్నాడో వాటన్నింటినీ భూమి మీద చేయుచున్నాను. యోహాను 6 : 38, - చేయుటకు నీవు నాకిచ్చిన పని నేను సంపూర్ణముగా నెరవేర్చి భూమి మీద నిన్ను మహిమ పరచితిని. యోహాను 17:4.** తన జీవిత కాలంలో తండ్రి తన కప్పగించిన పనిని పూర్తి చేయుటకై ఆయుష్కాలాన్ని వ్యర్థపరచుకొనకుండా పిన్న వయస్సునుండే యేసు భాద్యతలను ఏ విధంగా నేరవేర్చియున్నాడో క్రింద చదవండి - **నా తండ్రి పనుల మీద వుండవలెనని మీరెరుగరా? లూకా 2:42,49.** దేవుడు అమర్చిన శరీరాలతో, ఆ శరీరాలు అనుభవించే ఈ ప్రకృతిలో కారణజన్ములుగా ప్రతి మనిషి భూమి మీదకు రాగలుగుచున్నాడు. ఈ రహస్యాన్ని మనిషి ఎరుగకపోతే తానేమీ చేయుచున్నాడో తాను ఎరుగక పోవటం దురదృష్టకరం. పరలోకపు తండ్రి ఇష్టాన్ని నెరవేర్చవలసిన మనిషి తుచ్ఛమైన తన కోరికలను తీర్చుకొనుటకు భూమి మీద తన కాలాన్ని వ్యర్థపరచుకొనకూడదు. దేవుని పనులను భూమి మీద సంపూర్తి చేసికొని తిరిగి ఆయన యొద్దకు పోవుటకు సిద్ధపడవలెను. పితరులు, ప్రవక్తలు, భక్తులు, అపొస్తలులు, శిష్యులు మున్నగు వారంతా భూమి మీద దేవునికి లెక్క అప్పగించవలసిన వారుగా బహు జాగ్రత్త కలిగి బ్రతికినట్లు బైబిలు నందు చూడగలం. - **మీపైన నాయకులుగా వున్నవారు లెక్క యొప్పజెప్పవలసిన వారివలె మీ ఆత్మలను కాయుచున్నారు. హెబ్రీ 13 : 17.** అనవసరపు మాటలతో ఎదుటి వారిని తప్పు త్రోవ పట్టించినట్లుగా తప్పుడుగా మాట్లాడక దేవునికి భయపడుతూ వ్రాయబడిన వాటినే చెప్పునట్లు తమ నోళ్ళకు భద్రతను కలుగజేసిరని ఈ క్రింది మాటలను బట్టి గ్రహించగలము. - **నేను మీతో చెప్పునదేమనగా మనుష్యులు పలుకు వ్యర్థమైన ప్రతి మాటనుగూర్చియూ లెక్క చెప్పవలసి యుండును. మత్తయి 12 : 36.** అంతే కాదు మనిషికప్పగించిన భాద్యత అనగా నియమమును అసంపూర్తిగా కాక ప్రతి పనినీ పూర్తి చేయవలెనని దేవుడు చెప్పుచున్నాడు. -**క్రీస్తు నియమము (ఆయన వలె) పూర్తిగా నెరవేర్చుడి. ప్రతివాడునూ తాను చేయు పనిని పరీక్షించి చూచుకొనవలెను. ప్రతి వాడునూ తన బరువు తానే భరించుకొనవలెను గదా ? (పాతాళం తప్పదు). గలతీ 6 : 2 -5.** ఏ ఒక్కరూ తప్పించుకొనకుండ వలెనని బ్రతుకు కాలంలో బైబిల్ నందు వ్రాయబడి ఇవ్వబడిన లేదా అప్పగింపబడిన పనులన్నింటినీ మనిషి భూమి మీద తన బ్రతుకు కాలంలో పూర్తి చేయవలెను, తేడా జరిగిందో ఏ ఒక్కరూ తప్పించుకునే అవకాశమే లేదు. - **ఆ దినములు**

తక్కువ చేయబడక పోయిన యెడల ఏ శరీరియు తప్పించుకొనడు. ఏర్పరచబడిన వారి నిమిత్తం ఆ దినములుతక్కువ చేయబడును. మత్తయి 24 : 22, ఎందుకనగా దేవుని పనులు చేయు సజీవులకును, బ్రతికుండి ఆయన పనులు చేయని మృతులకును తీర్పు తీర్చుటకు సిద్ధముగా వున్న వానికి ఇరు వర్గాలు జవాబు దారులైయున్నారు. 1 పేతురు 4 : 5. ఎట్టి పరిస్థితులల్లోనూ ఏ ఒక్కరిని కూడా విడిచి పెట్టక ప్రతీవానిని యేసు క్రీస్తు నిలదీయునని ముందుగానే వ్రాయించెను. - మనుష్య కుమారుడు తన తండ్రి మహిమ గలవాడై తన దూతలతో కూడా రాబోవుచున్నాడు. అప్పుడాయన ఎవని క్రియల చొప్పున వాని లెక్కల ప్రకారం అట్టివారికి ఫలమిచ్చును. మత్తయి 16 : 27.

పుట్టుట చచ్చుట కొరకే, చచ్చి మరో జన్మలో మరలా పుట్టుట కొరకే అనుకొని పశువుల వలే వుండక అప్పగింపబడిన వాటిని లెక్క ప్రకారంగా పూర్తి చేసి తండ్రి చేత భళా నమ్మకమైన కుమారుడా అని అనిపించుకొనుటకు వేగిరపడు. లోక సంబంధమైన ఆశల లోనికి తొంగి చూడక, పాపభూయిష్టమైన సుఖాలకు అలవాటు పడక పనిమీద పంపబడిన వాడివని ఎరిగి తొందరగా పనులు పూర్తి చేసుకుని తిరిగి వెళ్ళుటకు వేగిరపడవలెను గానీ పిచ్చివానిలా భూమి మీద స్థిరపడుటకు ప్రయత్నించుట మానుకొనవలెను. సుమారు 630 కోట్ల మంది ప్రజలలో నీవొకడవని మర్చిపోవద్దు. కోట్లాది మందిలో ఈ జ్ఞానం లేదు. అలాంటప్పుడు భవిష్యత్ ఎరుగని అమాయకతోటి మానవులకు, పరలోకపు తండ్రిని ఎరిగిన నీవు ఏం చేయగలుగుతున్నావో నిన్ను నీవు ప్రశ్నించుకో ? ఎవరేమై పోతే నాకేమని మొండికేస్తే ఈ క్రింద చదువు. - నరపుత్రుడా, నీవు ఈ జనులకు సమాచారముప్రకటించుము - నేను దేశము మీదికి ఖడ్గము రప్పింపగా, బాకా ఊది జనులను హెచ్చరిక చేసినా జాగ్రత్త పడనందుకు ఖడ్గము వచ్చి వాని ప్రాణము తీసిన పక్షమున తన ప్రాణమునకు తానే ఉత్తర వాది. బాకా - నాదం విని జాగ్రత్త పడిన వాడుతనప్రాణములను రక్షించుకొనును. అయితే కావలి వాడు ఖడ్గం వచ్చుట చూచి బాకా - నాదము చేయకపోతే ఖడ్గము చేత చచ్చిన వాని ప్రాణమును గూర్చి కావలి వానిని విచారణ చేయుదును. నిన్ను కావలివానిగా నియమించియున్నాను గనుక నీవు నా నోటి మాటను విని నాకు ప్రతిగా వారిని హెచ్చరిక చేయవలెను. దుర్మార్గతను విడచి జాగ్రత్త పడునట్లు, నా మాట తెలియజేయని పక్షమున ఆ దుర్మార్గుడు తన దోషమును బట్టి మరణము నొందును గాని అతని ప్రాణమును గూర్చి నిన్ను విచారణ చేయుదును. యెహెజ్కేలు 33 : 2 - 9. పై వచనములను బట్టి తండ్రి సంకల్పాన్ని ఎరిగిన నీవు చుట్టూ వున్న అమాయక వ్యవస్థను కాపాడుటకై వారికి నిన్ను కావలిగా చేసియున్నాడు. నీ విద్యుత్ ధర్మాన్ని దేవుడు నిర్ణయించిన ప్రకారం పాటించలేదో నిన్ను లెక్కడుగుతానని కఠినంగా చెప్పుచున్నాడు. నీ పనిని నీవు పూర్తి చేయగలిగితే ఎదుటి వాడునీ మాట వినక పోయిననూ నిన్ను కాపాడు కొనగలవని చెప్పుచున్నాడు. - ఎవడైననూ ఈ పునాది మీద బంగారము, వెండి, వెలగలరాళ్ళు, కఱ్ఱ, గడ్డి, కొయ్యకాలు మొదలైన వాటితో కట్టిన యెడల, వాని వాని పని కనబడును, ఆ దినము దానిని తేటపరచును, అది అగ్ని చేత బయలు పరచబడును. పునాది మీద ఒకడు కట్టిన పని నిలిచిన యెడల వాడుజీతం పుచ్చుకొనును. ఒకని పని కాల్చివేయబడిన యెడల వానికి నష్టం కలుగును. అతడు తన మట్టుకు రక్షింపబడును గానీ అగ్నిలో నుండి తప్పించుకొన్నట్టు రక్షింపబడును 1 కొరింథి 3 : 12,15. పక్షపాతం లేకుండా క్రియలను బట్టి ప్రతివానిని వారి వారి లెక్కల ప్రకారం తీర్పు తీర్చువాడు తండ్రి. 1 పేతురు 1 : 17. ఎందుకనగా దేవుని సంకల్పాన్నిఎరిగిన నీవు భూమి మీద గల తండ్రి పనిని నీవు పూర్తి చేయడానికై, ఆయుష్కలం ఇవ్వబడి వచ్చియున్నావు. భూమి మీద నీవు బ్రతికిన కాలం తండ్రి బాధ్యతలతో కూడకొన్నదని నీవెరుగక పోతే నీకే ముప్పు. - నీ గృహనిర్వాహకత్వపు లెక్క అప్పగించవలెను. లూకా. 16 : 2

**భూమి మీద పాపములు పూర్తియగుట :**

ఒక చెట్టుకు కాయ కాసినా, పువ్వు, ఆకులు పూసినా, అవి పండినంత వరకే చెట్టును అంటిపెట్టుకుని యుండును. పండిపోయిన కాలానికి రంగు మారి రాలిపోవుట ఎంత సహజమో భూమి మీద మనిషి బ్రతుకు కూడా అంతేనని తెలుసుకొనవలెను. ఆ విధంగా పాపాలు పండిన భూమి మీద ఒక చక్రవర్తి సంగతి ఇక్కడ మీకు తెలియ

జేయుట అవసరం. అతడెవరో కాదు. క్రీస్తు పూర్వం ప్రపంచాన్ని పరిపాలించిన అతిపెద్ద సామ్రాజ్యాధినేత నెబుకద్నెజరు కుమారుడైన బబులోను సామ్రాజ్య చక్రవర్తి బెల్షస్సరు. - **తన తండ్రియగు నెబుకద్నెజరు యెరూషలేములో దేవుని ఆలయం నుండి తెచ్చిన వెండి, బంగారు పాత్రలల్లో అతని అధిపతులును, అతని రాణులును, అతని ఉపపత్నులును, వాటిలో ద్రాక్షారసం పోసి త్రాగిరి. వెంటనే ఆ ఘడియలోనే మానవ హస్తపు వ్రేళ్ళు కనబడి, దీపము దగ్గర రాజు యొక్కనగరు గోడ పూత మీద - వ్రాసిన శాసనమేదనగా, మెనే, మెనే టేకేల్ ఉఫార్సీన్. ఈ వాక్య భావమేమనగా, మెనే అనగా దేవుడు నీ ప్రభుత్వ విషయంలో లెక్క చూచి దాని ముగించెను. టెకేల్ అనగా ఆయన నిన్ను త్రాసులో తూచగా నీవు తక్కువగా కనబడితివి. ఫేరేస్ అనగా నీ రాజ్యం నీ యొద్ద నుండి తీయబడి మాదీయ, పారశీకులకు ఇయ్యబడును. దానియేలు 5 : 3-5, 22 - 27.** భూమి మీద మనిషిగా పుట్టిన వారిలో రాజైన, పేదైనా, ఏ ఒక్కరైనా దేవుని లెక్కల్లో వుండకపోతే వారి బ్రతుకు దుర్భరమని, ముగింపు పాతాళమని మర్చిపోకూడదు. నన్నెవరూ, చూచుట లేదని గానీ పట్టించుకొనలేదనిగానీ అనుకుంటే పొరపాటు సుమా. పాపాలు పండితే ఎవ్వరైనా నేల రాలవలసిందే. దేవునికి మరుగైన దేదియూ లేదు. - **ఆయన నా ప్రవర్తన నెరుగును గదా. నా అడుగు జాడలన్నింటినీ లెక్కించును గదా. అబద్ధికుడనై నేను తిరుగులాడిన యెడల మోసము చేయుటకై నాకాలు త్వరపడిన యెడల నేను యథార్థుడనై యున్నానని దేవుడు తెలిసికొనునట్లు న్యాయమైన త్రాసులో ఆయన నన్ను తూచును గాక. యోబు 31 : 4 - 7.** ముందుగా వ్రాయబడినట్లు మనమెవనికి లెక్క అప్పజెప్పవలసియున్నదో ఆ దేవుని కన్నులకు సమస్తమునుమరుగులేక తేటగా యున్నది. - **యెహోవా, నీవు నన్ను పరిశోధించి తెలిసికొని యున్నావు. నేను కూర్చుండుట, నేను లేచుట నీకు తెలియును. నాకు తలంపు పుట్టక మునుపే నీవు నా మనస్సు గ్రహించుచున్నావు. నా నడకను, పడకనునీవు పరిశీలన చేసి యున్నావు. నా చర్యలన్నింటినీ నీవు బాగుగా తెలిసికొని యున్నావు. యెహోవా, మాట నా నాలుకకురాక మునుపే అది నీకు పూర్తిగా తెలిసి యున్నది. నీ ఆత్మ యొద్ద నుండి నేనెక్కడికి పోవుదును ? నీ సన్నిధి నుండి నేనెక్కడికి పారిపోవుదును ? నేను ఆకాశమునకెక్కిననూ నీవు అచ్చట వున్నావు. నేను పాతాళమందు పండుకొనిననూ నీవు అక్కడ వున్నావు. కీర్తన 139 : 1- 8.**

తండ్రి, తన కార్యార్థమై నిన్ను భూమి మీదకి పంపినప్పుడు అతని నిఘా విభాగపు వ్యవస్థ అంతా నీ వెనుకే వున్నదన్నసంగతి మర్చిపోకూడదు. **అప్పగించినపనిని పూర్తి చేస్తావో, వాటిని చేయక నీ పాపాలను సంపూర్తి చేస్తావో** నిర్ణయించుకోవలసిన సమయం నీ కాసన్నమైనది. ఎందుకనగా ఆయనకు కాదని నీవెక్కడికీ పోలేవు గదా, పాపము పండిన మరుక్షణమే ఏదో ఒక విధంగా పండుటాకువలే నేల రాలిపోవుదువు. నీ చివరి దినమునుఒక్కసారి స్మరణకు తెచ్చుకుంటే - **ఒకడు సింహము యొద్ద నుండి తప్పించుకొనగా ఎలుగబంటి ఎదురైనట్టు, వాడుఇంటిలోనికి పోయి గోడ మీద చెయ్యి వేయగా పాము వానిని కరిచినట్టు ఆ దినముండును. ఆమోసు 5 : 19, భయము తప్పించుకొనుటకై పారిపోవు వారుగుంటలో పడుదురు. గుంటలో నుండి తప్పించుకొనువారు ఉరిలో చిక్కుకొందురు. యిర్మీయా 48: 44, హజాయేలు యొక్క ఖడ్గమును తప్పించుకొను వారిని యెహూ హతము చేయును. యెహూ యొక్క ఖడ్గమును తప్పించుకొన్న వారిని ఎలీషా హతము చేయును. 1 రాజులు 19 : 17.** ఎవరు ఎంతటి వారైననూ మరణదినమైన అంత్య దినమునకు ముందు ఏ విధంగానైననూ తప్పించుకొనలేరని, పాపాలు నిండుకొనగానే వారి చిట్టా పూర్తి చేయబడి అకస్మాత్తుగా పాతాళానికి జారిపోదురని దేవుడు సెలవిచ్చుచున్నాడు. ఒకనాటి మాజీ అమెరికా అధ్యక్షుడైన రోనాల్డ్ రీగన్ చంద్రునిపై స్థలాన్ని కొనుక్కొని గత కొద్ది కాలం క్రితమే దానిని అనుభవింపకనే భూలోకాన్ని వదలి వెళ్ళాడు. గొప్ప గొప్ప వాళ్ళమనుకొను వెఱ్ఱి వాళ్ళెందరో ! వారందరికీ ఈ గతి తప్పదు. నేటి ప్రపంచమొక మానసిక రోగుల (పిచ్చివాళ్ళ) నిలయం. కానివి, ఎన్నటికీ దక్కనివి, ఎండమావుల్లాంటి ఎన్నెన్నో కోర్కెల వలయాల్లో చిక్కుకొని ప్రపంచ మానవులు పిచ్చివాళ్ళుగా వాటి చుట్టూ తిరుగుచున్నారు. దేవుని సంకల్పాన్ని, ప్రపంచ మాయను ఎరుగక దిక్కుతోచని బ్రతుకులో వుంటూ, నిండుగా, గర్వంగా బ్రతుకుతున్న వీరిని చూచి కనికరపడవల్సిందే.

పండిపోయిన ఆకు నేల రాలునట్లుగా మనిషి పాపాలు నిండుకొనగానే రాలిపోక తప్పదు. సర్వేశ్వరుని సంకల్పంలో ఆయన ఇష్టాన్ని భూమి మీద నెరవేర్చుటకు ప్రతీ మనిషికి ఆయుష్కాలాన్ని కుదించి ఇచ్చుచున్నాడు. దేవుని పనికై ఆ ఇచ్చిన ఆయుష్కాలాన్ని వినియోగించక ప్రతీ మనిషి తన ఇష్టాన్ని జరిగించుచూ అందు పాపాలు పండగానే దిక్కుతోచని స్థితిలో మట్టిలోకి రాలిపోతున్నాడు - **దేవుడు అబ్రహాముతో నీవు క్షేమముగా మరణం తరువాత నీ పితరులు యొద్దకు పోయెదను. అయితే అమ్మోరీయులు అక్రమము ఇంకనూ సంపూర్ణము కాలేదు. ఆది. కా॥ 15 : 15, 16.** అబ్రహామైతే తండ్రి కోరిక మేరకు భూమి మీద బ్రతికి తన పితరుల యొద్దకు పరదైసుకు వెళ్ళగా అమ్మోరీయులు మాత్రం భూమి మీద వుండుటకు కారణం వారి పాపములు పండలేదని అర్థం. అందుకేనేమో "పాపి చిరాయువు" అను లోకోక్తి కలదు. భక్తి హీనులు, వాక్యానికి విరోధులు ధనంతో సుఖంగా బ్రతుకుతున్నారని అపోహ పడనవసరం లేదు. దేవుడు మాట మీద నిలబడే వాడు గనుక మనిషికిచ్చిన ఆయుష్కాలంను మంచికే గాని, చెడుకేగాని ఉపయోగించినా వారి కాలం చెల్లినంత వరకూ అనగా చివరి క్షణం వరకూ కనిపెడుతూనే ఉండును. చివరి దినానికి ఎటు వెళ్ళవలెనన్నది నీ చేతిలోనే వున్నది గనుక కాలం నిండి దేవుని దగ్గరకు వెళతావో ? పాపం పండి నరకానికి పోతావో? నిర్ణయం నీదే .

- **గ్రీకుల ప్రభుత్వం యొక్క అంతంలో వారి అతిక్రమముసంపూర్తి యగు చుండెను. దానియేలు 8 : 23.** చక్రవర్తుల రాజ్యాలు కూలిపోవాలన్నా మానవ ప్రభుత్వాలు పడిపోవాలన్నా కడకు ప్రతి మనిషి బ్రతుకు ముగిసి పోవాలన్నా " పాపాలు పండాలి" అని అర్థమగుచున్నది. మనిషి పాపం చేసి కూడా భూమి మీద ఎందుకు సుఖపడుచున్నాడని ఆలోచించవద్దు మరణం తరువాత రాబోయే శాశ్వత జీవిత కాలంలో ఏలాగు సుఖపడలేడు గనుక కనీసం భూమి మీద ఈ చిన్న కాలంలోనైనా సుఖపడడానికి దేవుడు వాడికి కాలం తీరినంతవరకూ కనిపెట్టుచున్నాడు. ఎన్ని మందులు వాడినా ఇక పని చేయవని, అట్టి రోగికి మరణం తథ్యమని అది కూడా అతి త్వరలో సంభవమని ముందుగా ఎరిగిన డాక్టర్లు రోగి బంధువులతో - అతనికి ఇష్టమొచ్చినన్ని పెట్టేయండి, ఏవిధంగాను బ్రతికే అవకాశం లేదు గనుక చచ్చే ముందైనా వాని కోర్కెలు తీర్చమని చెప్పుదురు. తెల్లవారితే నేరస్థులు ఉరి తీయబడునని ఎరిగిన జైలు అధికారులు ముందటి దినమే నేరస్థుని చివరి కోరిక అడిగి తీర్చెదరు. అదే విధంగా దేవుని పనికై భూమి మీద కొచ్చిన మానవజాతి స్వనిర్ణయాలతో సొంత ఇష్టాలను నెరవేర్చుకొన్న వీరిని మృత్యువుకు ముందేమాయా లోకాన్ని అనుభవించుటకు దేవుడు అవకాశమిచ్చెను. బైబిలు చరిత్ర పుటలలోనికి తొంగి చూస్తే దేవుడు ప్రేమించిన ఇశ్రాయేలీయుల బ్రతుకులు కూడా వారివలె నాశనమై రాలిపోవుచున్నవి - **మీరు ప్రవక్తలను చంపిన వారి కుమారులై యున్నారని మీమీద మీరే సాక్ష్యం చెప్పుకొనుచున్నారు. మీరునూ, మీ పితరుల పరిమాణం పూర్తి చేయుడి. సర్పములారా. సర్ప సంతానమా నరక శిక్షను మీరేలాగు తప్పించుకొందురు. ఇవన్నియూ యీ తరము వారి మీదికి వచ్చును. మత్తయి 23 : 31 - 36. ఆ యూదులు తమ పాపములను ఎల్లప్పుడూ సంపూర్తి చేయుటకై ప్రభువైన యేసును, ప్రవక్తలనుచంపి, మమ్మును హింసించిరి. 1థెస్స 2 : 15.** ఒకనాటి మోసగాడైన యాకోబు పేరును ఇశ్రాయేలుగా మార్చి వారిని , తనకిష్టులైన పిల్లలుగా మార్చికొనిననూ వారు రాలిపోవుటకే ఇష్టపడిరి గాని తండ్రికి భయపడి లెక్క జెప్పుటకు మాత్రం ఇష్టపడలేదు. సమస్తము తండ్రి తన లెక్కల ప్రకారమే జరిగించుచూ ఆయన పిల్లల బ్రతుకులుకూడా తానునిర్ణయించిన లెక్క ప్రకారం జరగాలని ఆశించాడు. ఆ ఆశలు నిరాశలు చేసి దేవునిని లెక్క చేయకుండా మనుష్యులు అవిధేయులై పాతాళపు లెక్కలోనికి చేరిపోతున్నారు. నేడు పరలోకం గానీ, పాతాళలోకం గానీ వాటి వాటి లెక్కలనుతొందర తొందరగా పూర్తి చేసుకున్నట్లు కనబడుతుంది. ఎవరిని ఏ లోకానికి పంపాలో భూమి మీదే తండ్రి లెక్కలను పూర్తి చేయుచున్నాడు. - **బహు కాలమైన తరువాత ఆదాసుల యజమానుడు వచ్చి వారి యొద్ద లెక్క చూచుకొనెను. మత్తయి 25 : 19.** ఈ లెక్కలలో మనుష్యుల మధ్య విభజన ఆరంభమైనది. పాతాళ, పరలోకపు లెక్కలు పూర్తియగునట్లుగా తండ్రి తన కార్యములను విస్తృత పరిచియున్నాడు. తన వారిని మాత్రం బహు

జాగ్రత్త కలిగి తన కాపుదలలో తన కార్యక్రమాలలో చూసి ఆనందించుచున్నాడు. తన కుమారుడైన యేసు మాటలు విని, ఆయన సంపాదనలోని ఆయన పిల్లలను గూర్చి ఆలోచన చేస్తున్నాడు. **- యేసు ఎవడునూ వాటిని నా చేతిలో నుండి అపహరింపడు, నా తండ్రి చేతిలో నుండి వారిని అపహరింపలేడు. యోహాను 10 : 28, 29. కావున పరలోకరాజ్యం, తన దాసుని యొద్ద లెక్క చూచుకొన గోరిన ఒక రాజును పోలియున్నదని విశదీకరించబడినది. మత్తయి 18 : 23.**

భూమి మీద ఎవరన్నా లెక్కలేని ఈ మనిషికి లెక్క ఒకటి వున్నదని ఎరిగి భూమి మీద భయముతో తన బ్రతుకును దేవుని ఇష్ట ప్రకారం బ్రతుకుటకు ప్రయత్నించవలెను. తల్లి తండ్రుల బంధం, భార్యాభర్తల బంధం, కుటుంబ బంధం, రక్త సంబందుల బంధం, ఆత్మీయుల బంధం, ప్రజల బంధం అను సుడిగుండంలో చిక్కుకొనక భూమి మీదకి పుట్టుకొచ్చిన ప్రతి మనిషి తన నివాస స్థలమైన పరలోకంతోనూ, తనను కన్న పరలోకపు తండ్రితోనూ శాశ్వత బంధం కల్గియున్నానని ఎరిగి, చావు తరువాత తన చోటికి పోవలెనన్న లెక్కను సరిగ్గా వేయకపోతే రాలిపోవుట ఖాయం. ఈ పత్రిక చదివి దేవుని లెక్కలలోనికి వస్తావో, లెక్క చేయక రాలిపోతావో చివరిగా ఈ క్రింది వచనాలను చదివి ఒక మంచి నిర్ణయాన్ని తీసుకో **- ప్రభువా, తర తరములనుండి మాకు నివాస స్థలము నీవే పర్వతములు పుట్టక మునుపు, భూమిని, లోకమును నీవు పుట్టింపక మునుపు యుగ యుగములు నీవే దేవుడవు. నీవు నరులను మంటికి ఎందుకు మార్చుచున్నావనగా వారిని తిరిగి రండని చెప్పుటకే. మా ఆయుష్కాలము డెబ్బది సంవత్సరములు. అధిక బలమున్న యెడల ఎనుబది సంవత్సరములగును. అయిననూ వాటి వైభవము ఆయాసమే. అవి త్వరగా గతించును. మేము ఎగిరి పోవుదము. కీర్తన 90 : 1 - 3, 10.**

నేటి కాలం క్రీస్తు లోకాన్ని ఏలుచున్న కాలం. ఆయన వాక్యం లోకమందు ప్రకటింపబడుచుండెను. అదే లోకమునకు తీర్పు తీర్చుచున్నది. ఆ వాక్యమును బట్టే భూమి మీద నీకు తీర్పు జరుగుచూ నీ కార్యములను బట్టి ఎటు వెళ్ళవలెనన్నది నిర్ణయం జరుగుచున్నది. నీకివ్వబడిన ఆయుష్కాలంలో **- భూమి మీద జరిగించిన క్రియల చొప్పున అవి మంచివైననూ సరే, చెడ్డవైననూ సరే, దేవుడు నీకిచ్చిన దేహంతో జరిగించిన వాటి ఫలమునుఎవడునూ తప్పించుకొనక ప్రతివాడునూ పొందుటకు అందరూనూ క్రీస్తు న్యాయ పీఠం (నీవు ఎటు వెళ్ళవలెనో నిర్ణయించే దేవుని వాక్యమైన బైబిల్) ఎదుట ప్రత్యక్షం కావలయును. 2 కొరింథీ 5 : 10.** భూమి మీద ఎందరో మహానుభావులు బ్రతుకు పరమార్థాన్ని ఎరిగి దేవుని కిష్టులై జీవించిరి. **- నేను యెష్షయి కుమారుడైన దావీదును కనుగొంటిని, అతడు నా ఇష్టానుసారుడైన మనుష్యుడు, అతడు నా ఉద్దేశ్యములన్నియూ భూమి మీద నెరవేర్చెను గనుక మరణించిన తరువాత అతని పితరుల యొద్దకు చేర్చబడెను. అపొ ॥కా॥ 13 : 22,36,37. తండ్రీ చేయుటకు నీవు నాకిచ్చిన పని నేను సంపూర్ణముగా నా ఆయుష్కాలంలో భూమి మీద నెరవేర్చితిని గనుక నీవున్న ఆ మహాలోకంలో నన్ను మహిమపరచు అని యేసు అడుగుచున్నాడు. యోహాను 17 : 4,5.**

ప్రియులారా, లెక్కల్లో ఉన్న దేవుణ్ణి లెక్క చేయుట మానక నీ బ్రతుకు లెక్క పూర్తికాక మునుపే నీ కొరకు వాక్యమందు వ్రాయబడిన నీ పనులన్నింటినీ పూర్తి చేసుకొని పరలోకపు లెక్కలోని వానిగా వుండునట్లు జాగ్రత్త పడగలవు. ఆ లెక్కలల్లో వున్న వారికే యేసు రాకలో పునరుత్థానం కలిగి తండ్రి రొమ్మున ఆనుకొనుట యేసు రెండవ రాకడ ముఖ్యోద్దేశం. **యేసు రాకలో క్రీస్తు నందు బ్రతికింపబడినవాడవై పరలోకపు జాబితా వరుస సంఖ్యాలో మీ పేరుండునని మరిచిపోవద్దు. 1 కొరింథీ 15 : 20 - 23.** ప్రపంచపు మాయలోనూ, తెచ్చి పెట్టుకున్న మనుష్యుల బంధాల సుడిగుండాలలోనూ చిక్కుకొనక, దేవుని లెక్కలతో నీ లెక్క సరి చూసుకుంటూ మిగిలిన నీ శేష జీవితాన్ని ఆయన కొరకు మాత్రమే బ్రతుకు. నీ కాలం, నీ కష్టం, నీ ఆరోగ్యం సమస్తం ఆయన కొరకే వాడుతూ పరలోకపు జాబితాలో చేరిపో.